# అథ సప్తమో%ధ్యాయః

# నరకలోక మార్గ వర్ణనము

సనత్కుమార ఉవాచ |

అథ పాపైర్నరా యాంతి యమలోకం చతుర్విధైః |
సంత్రాసజననం ఘోరం వివశాస్సర్వదేహినః || 1

గర్భస్థైర్జాయమానైశ్చ బాలైస్తరుణమధ్యమైః | స్త్రీ
పున్నపుంసకైర్జీవైర్జ్ఞాతవ్యం సర్వజంతుషు || 2

శుభాశుభఫలం చాత్ర దేహినాం సంవిచార్యతే |
చిత్రగుప్తాదిభిస్సర్వైర్వసిష్ఠ ప్రముఖైస్తథా || 3

న కేచిత్ప్రాణినస్సంతి యే న యాంతి యమక్షయమ్ | అవశ్యం హి
కృతం కర్మ భోక్తవ్యం తద్విచార్యతామ్ || 4

తత్ర యే శుభకర్మాణస్సౌమ్యచిత్తా దయాన్వితాః | తే నరా యాంతి
సౌమ్యేన పూర్వం యమనికేతనమ్ || 5

యే పునః పాపకర్మాణః పాపా దానవివర్జితాః | తే ఘోరేణ పథా
యాంతి ధక్షిణ న యమాలయమ్ || 6

షడశీతిసహస్రాణి యోజనానామతీత్య యత్ | వైవస్వతపురం
జ్ఞేయం నానారూపమవస్థితమ్ || 7

సమీపస్థమివాభాతి నరాణాం పుణ్యకర్మణామ్ | పాపినామతిదూరస్థం
పథా రౌద్రేణ గచ్ఛతామ్ || 8

తీక్ష్ణకంటకయుక్తేన శర్కరావిచితేన చ | క్షురధారానిభైస్తీక్ష్ణైః
పాషాణై రచితేన చ || 9

క్వచిత్పంకేన మహతా ఉరుతోకైశ్చ పాతకైః |
లోహసూచీనిభైర్దర్భైస్సంపన్నేన పథా క్వచిత్ || 10

సనత్కుమారుడిట్లు పలికెను-

సర్వమానవులు మరియు ఇతరప్రాణులు నాలుగు రకముల పాపముల ప్రభావముచే నిస్సహాయులై భయమును గొల్పు ఘోరమగు నరకమును పొందెదరు (1). అన్ని రకముల ప్రాణులులో గర్భమునందున్న వారు, అప్పుడే పుట్టిన వారు, బాల్యమునందున్నవారు, ¸ౌవనమును పొందినవారు, మధ్యవయస్కులు, స్త్రీలు, పురుషులు, నపుంసకులు అగు జీవులకు నరకము విదితమే (2). అచట వసిష్ఠుడు, చిత్రగుప్తుడు మొదలగు వారు అందరు ప్రాణుల పుణ్యాపాపకర్మల ఫలములను చక్కగా పరిశీలించెదరు (3), యమలోకమునకు వెళ్లని ప్రాణులు ఎవ్వరూ లేరు. జీవులు తాము చేసిన కర్మల ఫలములను నిశ్చయముగా అనుభవించ వలయును. మనమీ విషయమును గమనించవలెను (4). పవిత్రమగు అంతఃకరణము, దయాహృదయము గలవారై శుభకర్మలను చేయు మానవులు యముని నగరములోనికి సౌమ్యముగానుండే తూర్పు ద్వారము గుండా ప్రవేశించెదరు (5). పాపవిచారము గలవారై దానమును విడిచిపెట్టి పాపకర్మలను చేయువారు యమనగరములోనికి భయంకరమగు దక్షిణమార్గము గుండా ప్రవేశించెదరు (6). అనేకరూపములు గల యముని నగరము ఎనుబది ఆరు యోజనముల దూరమును దాటి ఉన్నదని తెలియవలెను (7). పుణ్యమును చేసుకున్న మానవులకు చాల దగ్గరగా నున్నట్లు, భయంకరమగు దారిలో పయనించు పాపాత్ములకు చాల దూరములో నున్నట్లు ఆ నగరము కన్పట్టును (8). పాపులు పయనించే మార్గము వాడి ముళ్లతో, చిన్న చిన్న రాళ్లతో నిండి, మరియు కత్తుల వలె వాడియైన పెద్ద రాళ్లతో నిర్మించబడి యుండును (9). కొన్ని చోట్ల విస్తారమైన బురద ఉండును. మరి కొన్ని చోట్ల చిన్న మరియు పెద్దయగు దర్భలు ఇనుప సూదులవలె వాడిగా నుండి దారిలో నడచువారల పాదములకు పీడను కలిగించును (10).

తటప్రాయాతివిషమైః పర్వతైర్వృక్షసంకులైః ప్రతప్తాంగారయుక్తేన యాంతి మార్గేణ దుఃఖితాః || 11

క్వచిద్విషమగర్తైశ్చ క్వచిల్లోష్టైస్సుదుష్కరైః | సుతప్తవాలుకాభిశ్చ తథా తీక్ష్ణైశ్చ శంకుభిః || 12

అనేకశాఖావితతైర్వ్యాప్తం వంశవనైః క్వచిత్ | కష్టేన తమసా మార్గే నానాలంబేన కుత్రచిత్ || 13

అయశ్శృంగాటకైస్తీక్ష్ణైః క్వచిద్దావాగ్నినా పునః | క్వచిత్తప్తశిలాభిశ్చ క్వచిద్వ్యాప్తం హియేన చ || 14

క్వచిద్వాలుకయా వ్యాప్తమాకంఠాంతః ప్రవేశయా |
క్వచిద్దుష్టాంబునా వ్యాప్తం క్వచిచ్చ కరిషాగ్నినా || 15

క్వచిత్సింహైర్వృకైర్వ్యాఘ్రై ర్వశ##కైశ్చ సుదారుణైః |
క్వచిన్మహాజలౌకాభిః క్వచిచ్చాజగరైస్తథా || 16

మక్షికాభిశ్చ రౌద్రాభి క్వచిత్సర్పైర్విషోల్బణైః |
మత్తమాతంగయూథైశ్చ బలోన్మత్తైః ప్రమాథిభిః || 17

పంథానముల్లిఖద్భిశ్చ సూకరైస్తీక్ష్ణదంష్ట్రిభిః | తీక్ష్ణశృంగైశ్చ మహిషైస్సర్వభూతైశ్చ శ్వాపదైః || 18

డాకినీభిశ్చ రౌ ద్రాభిర్వికరాలైశ్చ రాక్షసైః | వ్యాధిభిశ్చ మహాఘోరైః సీద్యమానా వ్రజంతి హి || 19

మహాధూలివిమిశ్రేణ మహాచండేన వాయునా | మహాపాషాణవర్షేణ హన్యమానా నిరాశ్రయాః || 20

మిక్కిలి ఎత్తుగా నుండి దాటుటలో అధికక్లేశమును కలిగించే గట్టులవంటి పర్వతములు చెట్లతో దట్టముగా నిండి ఆ మార్గములో నుండును. కణ కణ కాలుచున్న నిప్పులతో కూడియున్న ఆ మార్గములో పాపులు దుఃఖిస్తూ పయనించెదరు (11). కొన్ని చోట్ల దాటుటలో క్లేశమును కలిగించే గోతులు గలవు. కొన్ని చోట్ల మిక్కిలి పీడను కలిగించే బెడ్డలు ఉండును. కొన్ని చోట్ల మండే ఇసుక గలదు. మరికొన్ని చోట్ల వాడి మేకులు గలవు (12). ఆ మార్గమలో కొన్ని చోట్ల వివిధశాఖలతో వ్యాపించి యుండే వెదురు డొంకలు గలవు. కష్టమును కలింగించే ఆ మార్గము చీకటితో నిండి

పట్టుకొనుటకు ఆశ్రయము లేనిదై ఉండును (13). కూడలి స్థలములు వాడి ఇనుప మేకులతో నిండి యుండును. దారిలో కొన్ని చోట్ల దావాగ్ని ఉండును. కొన్ని చోట్ల కాలే రాళ్ళు ఉండగా, మరి కొన్ని చోట్ల మంచు నిండి యుండును (14). కొన్ని చోట్ల నడిచే వ్యక్తి కంఠము వరకు దిగబడి పోయే విధముగా ఇసుక ఉండును. కొన్ని చోట్ల బురద నీరు నిండియుండగా, మరి కొన్ని చోట్ల కాలుచున్న పిడకులు ఉండును (15). అక్కడక్కడ సింహములు, తోడేళ్లు,పెద్దపులులు, మిక్కిలి పీడను కలిగించే దోమలు, పెద్ద జలగలు మరియు కొండ చిలువలు ఉండును (16) భయమును గొల్పు ఈగలు, అత్యంతతీవ్రమగు విషమును కలిగయున్న పాములు, బలముచే మదించి సర్వమును పాదములతో త్రొక్కి నాశనము చేసే ఏనుగుల గుంపులు (17). వాడి కోరలతో నేలను చీల్చుచున్న పందులు, వాడి కొమ్ములు గల దున్నలు, మరియు అన్ని రకములు క్రూరమృగమలు (18). భయమును గొల్పు డాకినీ పిశాచములు, మిక్కిలి క్రూరులగు రాక్షసులు ఉండే ఆ దారిలో జీవులు మిక్కిలి ఘోరమైన రోగములచే బాధపడుతూ పయనించెదరు (19). ఆశ్రయము లేని ఆ జీవులు దట్టమైన ధూళితో నిండియున్న పెనుగాలులు కురిపించే రాళ్ల వర్షముచే కొట్టబడుచుందురు (20).

క్వచిద్విద్యుత్ప్రపాతేన దహ్యమానా వ్రజంతి చ | మహతా బాణవర్షేణ విధ్యమానాశ్చ సర్వతః || 21

పతద్భిర్వజ్రపాతైశ్చ ఉల్కాపాతైశ్చ దారుణైః | ప్రదీప్తాంగారవర్షేణ దహ్యమానాశ్చ సంతి హి || 22

మహతా పాంసువర్షేణ పూర్యమాణా రుదంతి చ |
మహామేఘవరైర్ఘోరైస్త్రస్యంతే చ ముహుర్ముహుః || 23

నిశితాయుధవర్షేణ భిద్యమానాశ్చ సర్వతః |
మహాక్షారాంబుధారాభిస్సిచ్యమానా వ్రజంతి చ || 24

మహాశీతేన మరుతా రూక్షేణ పరుషేణ చ |
సమంతాద్బాధ్యమానాశ్చ శుష్యంతే సంకుచంతి చ || 25

ఇత్థం మార్గేణ రౌద్రేణ పాథేయరహితేన చ | నిరాలంబేన దుర్గేణ నిర్జలేన సమంతతః || 26

విషమేణైవ మహతా నిర్జనాపాశ్రయేణ | తమోరూపేణ కష్టేన సర్వదుష్టాశ్రయేణ చ || 27

నీయంతే దేహినస్సర్వే యే మూఢాః పాపకర్మిణః | యమదూతైర్మహాఘోరైస్తదాజ్ఞాకారిభిర్బలాత్ || 28

ఏకాకినః పరాధీనా మిత్రబంధువవర్జితాః | శోచంతస్స్వాని కర్మాణి రుదంతశ్చ ముహుర్ముహుః || 29

ప్రేతా భూత్వా వివస్త్రాశ్చ శుష్కకంఠౌష్ఠతాలుకాః | అసౌమ్యా భయభీతాశ్చ దహ్యమానాః క్షుధాన్వితా ః || 30

వారు అక్కడక్కడ మెరుపులచే కాల్చబడుచున్నవారై ముందుకు సాగెదరు. వారిని పెద్ద పెద్ద బాణవర్షము అన్ని వైపులనుండియు ముంచెత్తును (21). వారిపై దారుణమైన పిడుగులు, ఉల్కలు పడుచుండును. వారువెళ్లుచుండగా, కాలే నిప్పులు వారిపై వర్షించును (22). దట్టమైన ధూళి వర్షించి కప్పివేయుటచే వారు దుఃఖించెదరు. ఘోరములగు పెద్ద మేఘములు వారిని తరుచుగా భయపెట్టుచుండును (23). అన్ని వైపులనుండియు వాడి ఆయుధములు వర్షించి వారి దేహములు కోసివేయబడును. క్షారజలముల పెద్ద ధారలు వారిపై కురియుచుండగా, వారు పూర్తిగా ఆ జలములో తడిసి వెళ్లుచుందురు (24). మిక్కిలి చల్లనిది, శరీరము కోసివేయునది అగు వాయువు వేగముగా వీచుచుండగా, వారు కుంచించుకొని పోయెదరు. వారి దేహములు ఎండిపోవును (25). ఈ విధముగా భయంకరమైనది, మధ్యలో ఆహారవ్యవస్థ లేనిది, నిలువ నీడ లేనిది, దాట శక్యము కానిది, ఎచ్చటనైననూ త్రాగే నీరు లేనిది, మిక్కిలి ఎగుడు దిగుడులు గలది, జనసంచారము లేనిది, చీకటితో నిండినది, క్లేశమును కలిగించునది. దుష్టులందరకీ ఆశ్రయమైనది అగు మార్గము గుండా (26, 27), పాపములను చేసిన మూర్ఖజీవులనందరినీ యముని ఆజ్ఞను పాటించే మహాభయంకరులగు యమదూతలు

బలాత్కారముగా గొనిపోవుచుందురు (28). ఏకాకులు, అస్వతంత్రులు, మిత్రులు గాని బంధవులు గాని తోడు లేనివారు, తాము చేసిన పాపములను స్మరించి పలుమార్లు దుఃఖించువారు అగు జీవులు (29). చూచుటకు రోత పుట్టించే ప్రేతములై, వస్త్రములు లేకుండగా, కంఠము నాలుక పెదవులు ఎండిపోవుచుండగా, ఆకలితో కడుపు మండి పోవుచుండగా, మిక్కిలి భయమును పొంది పయనించెదరు (30).

బద్ధాశ్శృంఖలయా కేచిదుత్తానపాదకా నరాః | కృష్యంతే కృష్యమాణాశ్చ యమదూతైర్బలోత్కటైః || 31

ఉరపాధోముఖాశ్చాన్యే ఘృష్యమాణాస్సుదుఃఖితాః | కేశపాశనిబంధేన సంస్కృష్యంతే చ రజ్జునా || 32

లలాటే చాంకుశేనాన్యే భిన్నా దుష్యంతి దేహినః | ఉత్తానాః కంటకపథా క్వచిదంగారవర్త్మనా || 33

పశ్చాద్బాహూనిబద్ధాశ్చ జఠరేణ ప్రపీడిదాః | పూరితాశ్శృంఖలాభిశ్చ హస్తయోశ్చ సుకీలితాః || 34

గ్రీవాపాశేన కృష్యంతే ప్రయాంత్యన్యే సుదుఃఖితాః | జిహ్వాంకుశప్రవేశేన రజ్జ్వాకృష్యంత ఏవ తే || 35

నాసాభేదేన రజ్జ్వా చ త్వాకృశ్యంతే తథాపరే | భిన్నాః కపోలయో రజ్జ్వాకృష్యంతే%న్యే తథౌష్ఠయోః || 36

ఛిన్నాగ్రపాదహస్తాశ్చ చ్ఛిన్నకర్ణోష్ఠనాసికాః | సంఛిన్నశిశ్నవృషణాః ఛిన్నభిన్నాంగసంధయః || 37

ఆభిద్యమానాః కుంతైశ్చ భిద్యమానాశ్చ సాయకైః | ఇతశ్చేతశ్చ ధావంతః క్రందమానా నిరాశ్రయాః || 38

ముద్గరైర్లోహదండైశ్చ హన్యమానా ముహుర్ముహుః | కంటకైర్వివిధైర్ఘోరైర్జ్వలనార్కసమప్రభైః || 39

భిందిపాలైర్విభిద్యంతే స్రవంతః పూయశోణితమ్ | శకృతా కృమిదిగ్ధాశ్చ నీయంతే వివశా నరాః || 40

బలముతో మదించయున్న యమదూతలు కొందరిని కాళ్లను పైకి కట్టి గొలుసుతో బర బర ఈడ్చుచుండిరి (31). వారు కొందరి ముఖమును వక్షఃస్థలము పైకి నొక్కి పెట్టి జుట్టును త్రాటితో లాగుచుండగా ఆ జీవులు మహదుఃఖమును అనుభవించుచుండిరి (32). కొందరు ప్రాణులను వెల్లకిలా పరుండబెట్టి లలాటముపై అంకుశమును గ్రుచ్చి, అక్కడక్కడ ముళ్లతో మరియు నిప్పులతో కూడియున్న మార్గము గుండా తీసుకుని వెళ్లుచుండగా, వారు కష్టపడుచుండిరి (33). కొందరి చేతులను వెనుకకు విరచి కట్టి పొట్టలో కొట్టుచుండిరి. కొందరిని దేహము అంతటా గొలుసులతో కట్టి చేతులలో మేకులను దింపిరి (34). కొందరి మెడకు త్రాటిని కట్టి లాగుచుండగా, వారు మహాదుఃఖముతో ముందుకు సాగుచుండిరి. కొందరి నాలుకపై అంకుశమును దింపి త్రాటితో వారిని లాగుచుండిరి (35). మరి కొందరి ముక్కునకు త్రాడు వేసి దానితో లాగుచుండిరి. కొందరికి చెక్కిళ్లకు, మరికొందరి పెదవులకు త్రాళ్లను వేసి లాగుచుండిరి (36). వారి చేతులు మరియు కాళ్లయొక్క అగ్రములు, చెవులు, పెదవులు, ముక్కులు, శిశ్నములు, అండములు కోసివేయబడెను. కొందరి అవయవములు మరియు కీళ్లు విరుగ గొట్టబడెను (37). శూలములతో మరియు బాణములతో కొట్టబడినవరై వారు దిక్కు తోచక ఏడుస్తూ ఇటునటు పరుగులెత్తు చుండిరి (38) వారు రోకళ్లతో మరియు ఇనుపకర్రలతో కొట్టబడిరి. అగ్నితో మరియు సూర్యునితో సమానమగు వేడి గల భయంకరమైన అనేకరకముల ముళ్లతో వారు గుచ్చబడుచుండిరి (39). బల్లెములచే పొడువ బడినవరై ఆ మానవులు రక్తము కారుచుండగా, క్రిములతో నిండిన మలమును విసర్జిస్తూ వాటిచే కలుషితులై నిస్సహాయులై లాగబడుచుండిరి (40).

యాచమానాశ్చ సలిలమన్నం వాసి బుభుక్షితాః | ఛాయా ప్రార్థయమానాశ్చ శీతార్తాశ్చానలం పునః || 41

దానహీనాః ప్రయాంత్యేవం ప్రార్థయంతస్సుఖం నరాః |
గృహీతదానపాథేయాస్సుఖం యాంతి యమాలయమ్ || 42

ఏవం న్యాయేన కష్టేన ప్రాప్తాః ప్రేతపురం యదా | ప్రజ్ఞాపితాస్తతో
దూతైర్నివేశ్యంతే యమాగ్రతః || 43

తత్ర యే శుభకర్మాణస్తాంస్తు సమ్మానయేద్యమః |
స్వాగతాసనదానేన పాద్యార్ఘ్యేణ ప్రియేణ చ || 44

ధన్యా యూయం మహాత్మానో నిగమోదితకారిణః | యైశ్చ
దివ్యసుఖార్థాయ భవద్భిస్సుకృతం కృతమ్|| 45

దివ్యం విమానమారుహ్య దివ్యస్త్రీ భోగభూషితమ్ | స్వర్గం
గచ్ఛధ్వమమలం సర్వకామసమన్వితమ్ || 46

తత్ర భుక్త్వా మహాభోగానంతే పుణ్యస్య సంక్షయాత్ |
యత్కించిదల్పమశుభం పునస్తదిహ భోక్ష్యథ || 47

ధర్మాత్మానో నరా యే చ మిత్రభూతా ఇవాత్మనః | సౌమ్యం సుఖం
ప్రపశ్యంతి ధర్మరాజానమేవ చ|| 48

యే పునః క్రూరకర్మాణస్తే పశ్యంతి భయానకమ్ |
దంష్ట్రాకరాలవదనం భ్రుకుటీకుటిలేక్షణమ్ || 49

ఊర్ధ్వకేశం మహాశ్మశ్రుమూర్ధ్వ ప్రస్ఫురితాధరమ్ | అష్టాదశభుజం
క్రుద్ధం నీలాంజనచయోపమమ్ || 50

వారు ఆకలి గొన్నవారై అన్నమును మరియు నీటిని ఇండనియు, ఎండకు తాళ##లేక నీడను, చలిని భరించలేక అగ్నిని కల్పించుడని ప్రార్థించుచుండిరి (41). దానమును చేయని మానవులు ఈ విధముగా సుఖమును కటిగించుడని యాచిస్తూ పయనించెదరు. కాని, దానము చేసి పుణ్యము సంపాదించుకున్నవారికి ఆ పుణ్యము యమనగరమునకు వెళ్లే మార్గమధ్యములో ఆహారమువలె సుఖమునిచ్చును (42). ఈ విధముగా చేసుకున్న కర్మకు అనురూపమైన కష్టమునమభవిస్తూ వారు యమనగరమునకు చేరగానే, వెంటనే దూతలు యమునికి

విన్నవించి ఆయన యెదుట వీరిని నిలబెట్టెదరు (43). వారిలో పుణ్యకార్యములను చేసిన వారిని యముడు స్వాగతము పలికి ఆసనముపై కూర్చుండబెట్టి, అభీష్టమగు పాద్యమును మరియు అర్ఘ్యమును ఇచ్చును (44). వేదము చెప్పిన విధముగా చేసిన మీరు ధన్యులు మరియు మహాత్ములు. మీరు దేవలోక సుఖములను గోరి పుణ్యకర్మలను చేసియుంటిరి (45). మీరు దివ్యమగు విమానమును ఎక్కి, దివ్యస్త్రీల విలాసములతో భూషితమై కోర్కెలనన్నింటినీ ఈడేర్చ పాపసంపర్కము లేని స్వర్గమునకు వెళ్లుడు (46). అచట గొప్ప భోగముల ననుభవించి అంతములో పుణ్యము ఖర్చు కాగానే మిగిలియున్న కొద్ది పాపమును మరల ఇచల అనుభవించెదరు అని వారికి యముడు చెప్పును (47). ధర్మాత్ములగు మానవులను యముడు తన మిత్రులవలెఆదరించును. వారు యమధర్మరాజుయొక్క సౌమ్యమగు రూపమును సుఖముగా దర్శించెదరు (48). కాని క్రూరమగు కర్మలనాచరించువారు భయంకరుడు, కోరలతో వికృతమైన నోరు గలవాడు, కనుబొమ్మ ముడిపడుచుండగా క్రూరముగా చూచువాడు, పైకి విస్తరించి వణుకుచున్న క్రింది పెదవి గలవాడు, పదునెనిమిది చేతులు గలవాడు, కోపించి యున్నవాడు, కాటుక కొండను పోలియున్న వాడు అగు యముని చూచెదరు (49, 50).

సర్వాయుధోద్ధృతకరం సర్వదండేన తర్జయన్ |
మహామహిషమారూఢం దీప్తాగ్నిసమలోచనమ్ || 51

రక్తమాల్యాంబరధరం మహామేరుమివోచ్ఛ్రితమ్ |
ప్రలయాంబుదనిర్ఘోషం పిబన్నివ మహోదధిమ్ || 52

గ్రసంతమివ శైలేంద్రముద్గిరంతమివానలమ్ | మృత్యుశ్చైవ సమీపస్థః కాలానలసమప్రభః || 53

కాలశ్చాంజనసంకాశః కృతాంతశ్చ భయానకః | మారీచోగ్రమహామారీ కాలరాత్రిశ్చ దారుణా || 54

వివిధా వ్యాధయః కుష్ఠా నానారూపా భయావహాః |
శక్తిశూలాంకుశధరాః పాశచక్రాసిపాణయః || 55

వజ్రతుండధరా రుద్రా క్షురతూణధనుర్ధరాః |
నానాయుధధరాస్సర్వే మహావీరా భయంకరాః || 56

అసంఖ్యాతా మహావీరాః కాలాంజనసమప్రభాః |
సర్వాయుధోద్యతకరా యమదూతా భయానకాః || 57

అనేన పరిచారేణవృతం తం ఘోరదర్శనమ్ | యమం పశ్యంతి
పాపిష్ఠాశ్చిత్రగుప్తం చ భీషణమ్ || 58

నిర్భర్త్సయతి చాత్యంతం యమస్తాన్ పాపకర్మణః | చిత్రగుప్తశ్చ
భగవాన్ ధర్మవాక్యైః ప్రబోధయేత్ ||

ఇతి శ్రీశివమహాపురాణ ఉమాసంహితాయాం నరకలోకమార్గవర్ణనం నామ సప్తమో%ధ్యాయః (7)

యముడుపైకి ఎత్తిన తన చేతులతో ఆయుధముల నన్నింటినీ ధరించి సర్వులను దండముచే భయపెట్టును. గొప్ప దున్నను అధిష్ఠించి యున్న యముని నేత్రములు మండే నిప్పులను పోలియుండును (51). ఎర్రని మాలను మరియు వస్త్రములను ధరించు ఆయన గొప్పది యగు మేరు పర్వతమువలె నుండును. ఆయన మహాసముద్రమును త్రాగివేయునా యన్నట్లు కానవచ్చును. ఆయన మాటలు ప్రలయకాలమేఘముయొక్క గర్జనను పోలియుండును (52). ఆయన పర్వతములను మ్రింగువానివలె, నిప్పులను గ్రక్కువానివలె కన్పట్టును. ప్రలయకాలాగ్నిని పోలిన కాంతి గల మృత్యుదేవత ఆయనకు సమీపములోననే యుండును (53). సర్వమును నశింపచేయు ఆ మృత్యువు కాటుక వలె నల్లని వర్ణము గలవాడై భయమును గొల్పుచుండును. మారి, ఉగ్రమహామారి, భయంకరమగు కాళరాత్రి యముని కొల్చెదరు (54). అనేకరకములగు వ్యాధులు, భయమును గొల్పే నానారూపములగు కుష్ఠువ్యాధులు అక్కడ రూపు దాల్చి యుండును. వారు శక్తి, శూలము, అంకుశము, పాశము,

చక్రము, కత్తి అనే ఆయుధములను చేతులలో ధరించి యుందురు (55). భయంకరులగు ఆ యమానుచరులు వజ్రము వలె పదునైన నోళ్లను కలిగియుందురు. ఛురిక, అంబుల పొది, ధనుస్సు మొదలైన అనేకములగు ఆయుధములను మహావీరులగు ఆ అనుచరులు ధరించి భయమును గొల్పుచుందురు (56). లెక్కలేనంత మంది మహావీరులైన యమదూతలు కాటుకతో సమమైన నల్లని వర్ణము గలవారై ఆయుధముల నన్నింటినీ చేతులలో ఎత్తి పట్టుకొని భయమును కలిగించుచుందురు (57). ఈ విధమగు పరిచారకులతో గూడి భయంకరముగా కన్పట్టే యముని మరియు భయంకరాకారుడగు చిత్రగుప్తుని పాపాత్ములు దర్శించెదరు (58). ఆ పాపాత్ములను యముడు అధికముగా కోపించి భయపెట్టును. చిత్రగుప్తభగవానుడు ధర్మబద్ధములగు వాక్యములతో వారికి బోధించును (59).

శ్రీశివమహాపురాణములోని ఉమాసంహితయందు
నరకలోకమార్గవర్ణనమనే ఏడవ అధ్యాయము ముగిసినది (7)